553

OFF... MADRAS. 1911

# ANUBHAVA SUDHANIDHI.

PART II

FOR THE USE OF BOYS & GIRLS.

BY

**Palepu Bangararaju.**

Sl no 817
Acc no 7431
12

Rajahmundry:

Printed at the Chintamani Printing works.

1911.

Price 2 Annas.

శ్రీ వేంకటరమణస్సహాయః

# అనుభవసుధానిధి.

---

శా. శ్రీలంబోదరు నేకదంతు శివగౌరీపుత్రు విఘ్నేశు హేరం
బూలంబూజలు సేసి మ్రొక్కెద దలంపుల్ సాగు విఘ్నాలకుం
బాలై పోవక, నిన్ను సన్నుత నిజ స్వాంతంగవక్త్రా మహా
కాలాద్యర్చితమూషకోత్తమ తురంగా మోదకాంచత్కరా.

క. కమలాసనుఁ గమలాపతిఁ
గమలకరు గ్గమలబంధుఁ గమలాంకు సుధా
విమలు గ్గమల గ్గాత్రి
న్నుతుల ద్వైపాయనాదిసూరులఁ దెలుతున్ .2.

క. భువి దివి భాస్కరచంద్రులు
పవనుం డనిలుండు జలము స్వాంతము సాక్షు

రాతిలోనికప్ప రక్షింపఁడే నారు
పోసినాఁడు నీరు పోయకున్నె. 10

ఆ. గీ. గిట్ట పేదమగఁడు పెట్టును బాదంబు
మఁట్టక పని విసిగి మూల్గునాలు
చెడఁగ మొదలుముట్ట చెట్టుపుట్టును గుక్క
మూతిపిండె లంచము బోధకునులు. 11

క. ఆడినదబ్బఱ లప్పుడు
పోఁడిమిగాఁ గానఁబడినఁ బొసఁగవు తుదకున్
గాసిదపిల్లకు మిసమిస
వీడదె చిగిలింత మేపు విఱుగడ గనదే. 12

ఆ. గీ. విత్తవంతుల మని విఱ్ఱవీఁగెడువారు
పాపకార్యములకు భయముపడరు
దాఁచబెట్టుసొమ్ము నాఁచుంటకంటెను
బడుకుగట్టి నూతఁ బడుటమేలు. 13

ఆ. గీ. ఆడితప్పువార లవమానపాత్రులు
గోఁజెఱుఁగనివారు కొలఁదినరులు
పెట్టెల కిడక దాఁచిపెట్టు ధనమ్ముగుఁ
దుదకుఁ దొంగపాలొ దొరలపాలొ. 14

ఆ. గీ. గంతగట్టఁదిరుగు గానుగునెద్దుపో
లికనులుకుచు నాల్పలికిన నుడికిఁ
గత్తిరింప గఱులు కాకము వీఁకను
బహుమము టుష యుడిగి పురుషుఁ డుండు. 15

క. కృతపరిణయుఁ డగు సుకృతికి
సుతు లుదయించెదరు వారిసుగుణతచేతం
బితకు నెసఁగుఁ గీర్తి యది
క్షితినుండెడు సంతతడవు చెందుఁ ద్రిదివమున్. 16

క. పిల్లలుగల యిల్లొనరుచు
నుల్లము రంజిల్లఁ గన్న యున్నతులు గనన్

బల్లవుఁబై రులటీరున
నుల్లాసము కన్నుఁగవకు నొదవఁగఁ జేయున్. 17

క. ఇమ్మని యర్భకు లడుగక
యమ్మయుఁ బెట్టదను సామ్య మన్వర్థముగా
రమ్మని కడుపారఁగ నో
రెమిఁకువా రెవరు తలికీతి నగతిన్. 18

ఆ. గీ. అయ్య యమ్మ యందు రర్భకు ల్జనఘుల
నన్న యమ్మి యంద్రు కన్నవారు
నాలుబిడ్డలపయి నర్మిలి నరునకుఁ
నుండునంత వారి కుండ దకట. 19

ఆ. గీ. ఆకసమ్మునందు నబ్బురముగ నెప్పు
డయిన మినుకు మినుకు మనుచు నున్న
రిక్కగముల నరులు లెక్కసేయనికీతిఁ
జెదరి తిరుగువాండ్రఁ జెప్పనెవఁడు. 20

ఆ. గీ. కోడికూఁత జాము గుఱుతగుఁ; గోకిల
పంచమము వసంత మెంచఁ జేయు;
గూబ వచ్చె నేవ్రుకో జంతులనఁ గూయు;
వేగఁ బులుఁగు లఱచు విధినియుక్తి. 21

ఆ. గీ. పోకిరి గమితోఁడిపొందుకై పోవును
గారణమ్ము లేని క్షలహ మూడు
స్తుతులకంటె సాగు దూషణములకు దు
ర్జనుఁడు పరులధనము సతులఁ గోరు. 22

ఆ. గీ. చేతివ్రేళు లైదు చేర దగ్గఱచెలి
వంటకంబు మెక్కువలను గాంచు
నెడము పడినమనుజుఁ డెట్లు భుజించెడుఁ
జెలిమి దొలఁగినట్టు లలజడి యగు. 23

ఆ. గీ. అంద ఱనుమతించు నాపని యగునట్లు
కా దొకండు తలఁచు కర్జ; మైక

'ఐక్య మున్నఁ గార్య మత్యంత సుకరమౌఁ
జేయ శక్తిఁ గల్గుఁ జివరవఱకు. 24

చ. అలుకయొసంగు నేళనత్రులన్నము మానుదు రేమి హేతువో
తెలియఁ దలంచి యడ్గినను జెల్పరు పిల్చిన బల్క రెప్పుడు
స్గలకలవృవ్యమోహముచఁ గనంబడ దింతవికాస మద్దిరా
తలఁచెదనిండిరోస మెసఁదంజొరనీయదొనీరుగూడు నేఁ

క. తినినది యొసంగినదియు
ధనవంతులధనము తక్కుధన మొరులకుఁ గా
చును వెఱబొమ్మవితమ్మనఁ
దినఁడు పిసిడి విసము పగిదిఁ దీఱుచు నొక్కో. 26

ఆ. గీ. ఎత్తు చోట గాలి యెవ తెఱపి గనక
వీచుచుండు గృహులు వేడుకపడ
నీయెలమికి మఱగియే ధనవంతులు
గొంత సౌధములను గట్టికొంద్రు. 27

ఆ. గీ. విద్యవలన నబ్బువిత్తంబు; దానిచే
నిష్టభోగతృప్తి యొసఁగుఁ; బాత్ర
వితరణమునఁ గల్గువిఖ్యాతి స్వర్గద;
సాటివిద్య కెన్నఁ జాలు నెవఁడు. 28

ఆ. గీ. విత్తనంబు వేయఁ బెరిఁగి చెట్టయి తీయఁ
బండ్లు గలదియైనఁ బ్రజలు మెత్తు
రట్లు పుట్టి మనుజుఁ డభివృద్ధి నొంది లో
కోపకారియైన నొదవుకీర్తి. 29

ఆ. గీ. పృథ్విఁ బుట్టి మేలివిద్దెలు నేర్చుచుఁ
బెరిఁగి పెద్దయగుచుఁ బెండ్లియాడి
తనయులఁ గని చేసితపము, విరాగులౌ
మౌనులకు మరణము మంగళంబు. 30

తే. గీ. ఆపగా దీర్ఘికాంధుసరోంతరముల
జలము మజ్జనపానపచనముఖక్రి

యుల కుపకరించి రక్షించుఁ బ్రాణుల నదె
కతము దేవతలనివానిశ్రుతులు పొగడ. 31

క. పలుసంజ్ఞలు రూపములు
స్థలభేదములు గడలిఁ గలిసి కడలియె యగున
ట్టులె దేహాదివివిక్తము
తెలివి పరబ్రహ్మమె యగుఁ దెలియ సుగ మగున్.

క. జలమున నుదయస్థితిలయ
ములనొందు తరంగఫేనబుద్బుదము లదే
కల బ్రహ్మమందు జన్మా
దులు మాయం గాంచునట్లు తోఁచు జగ మదే.

ఆ. గీ. నివురుగప్పునిప్పు నవిధము బ్రహ్మము; రాహు
గప్పు చందు; తన్నుఁ గప్పుజడము
వెలయఁ జేయుఁ దాను వెలయు నసత్యము
విడిచి సత్య మెఱుఁగు విబుధసేవ. 34

క. పురుషుండు భర్త యనఁబ
భరియించుట గనము; కష్టపడి, పాకము చే
సి, రమణుఁ బ్రతిదివసమ్మును
భరియించును;సతులగృహముభర్త్రియనఁదగున్.

తే. గీ. ఎల్లపుడు వీచుచు న్గాలి, వినుఁడు తోఁచు,
చేళ్లు ప్రవహించు, చవకాశ మిడుచు నభము
వహ్ని మండుచుఁ, బండుచు వసుధ ప్రోచు
నట్టు లొరులకు మేల్సేయు నార్యుఁడు మను. **36**

క. ఏకార్య మెవ్వఁ డొసగిన
సాకతమునఁ జేయఁబూన సర్వేశ్వరుఁడే
ధీకిఁ బ్రకాశము బలము
న్వాకునకుం జదురు నిచ్చి వాసి యొసంగున్. **37**

క. ఒకనికి నుపకృతిగా, వే
రొకనికి నపకృతిగఁ గార్య మొప్పదు సేయన్

సకల శ్రేయస్కరమై
నకలజద లాసరించు సుజనునకు శుభము లగుర్. 38

క. సుతులమ్మతి గననిసుకృతా
న్వితులును గల రదుగాను బెక్కు నరులకున్
బ్రతుకుదురు సుతులు గొందఱ
షితిరుహముల కాయ ళట్లు చిత్రము లింకన్. 39

ఆ. గీ. మొగ్గ పూవు పిందె పూప పనరుకాయ
దోరగాయ పండు నొర యవును
వరుసనట్లె శిశువు బాలుఁడు తరుణుఁడు
స్థవిరుఁడు నగునట్లె సమయుటయును. 40

ఆ. గీ. ఒక్కవస్తువునకె పెక్కునామమ్ములు
వచ్చురూపములును; వానిరాక
రాఁడు; వానిపోకఁ బోఁడాత్మ సర్వాను
గతుఁడు సత్యుఁ డెఱుఁగఁ గలుగుముక్తి. 41

తే. గీ. పంచభూతవికారము బాహ్యతనువు
బుద్ధికర్మేంద్రియప్రాణబుద్ధి మనము
లాంతరాంగము పదియేడు నాత్మ కిరవు
సాక్షి సర్వాంతరుఁడు సర్వసముఁ డొకండు. 24

తే. గీ. పెక్కు డిటమగుకట్టెలు బిగియఁ గట్ట
విఱువ నెవ్వఁడుఁ జాలఁ; డావిధమున నరు
లైకమత్యము నందిన నధికబలులు
పరిభవింపఁగఁ జాలరు పరులు వారి. 43

ఆ. గీ. పండు లన్నియున్నఁ బచ్చగాఁ జవి తార
తమ్య ముండునట్లు తనువు లెల్ల
సరిగ నున్నవర్ణ సత్యదయాక్షమా
ప్రముఖములను మీఱు బ్రాహ్మణుండు. 44

ఆ. గీ. గోవుపాలు తీపు, కోల లెల్లఁ దొలఁగించు
నావుఁబోలు పూజ్య మవనిఁ బూజ్య

మగ్రజన్మ, కలిసమ్మా వేళ హాతయజ
నాది తొంటియట్టు లర్హ్యుఁ డగునో. 45

ఆ. గీ. ఊహ లేనివార లూర నెం దుండిన
నూరు పేరు లేక యుండు నెపుడు
నెద్దు దున్నపోతు హెచ్చు తగ్గైనట్టు
లలరు మందమతి కుశాగ్రబుద్ధి 46

ఆ. గీ. నిమ్మ నారికడము నేరేడు దానిమ్మ
యంటి తియ్యమావి యంటుమావి
దాక మొదలుపండ్లు ధన్యులు తిందురు
వేఁపపండ్లు కాకి విందుసేయు 47

ఆ గీ. కుక్క నందలమునఁ గూర్చుండఁబెట్టినఁ
గుచ్చు లన్ని కొటికి కూల్చినట్టు
లల్పజాతి కెప్పు డధికార మిచ్చిన
దొడ్డకులమువానిఁ దూలనాడు. 48

క. దినములు చాలనిసరునకు
వినకుందురు పలుకు లెవరు; విత్తము లేమిం
బనిగాదు పాటు పడినను;
దినముల కొఱగామి కెంతో దీనతఁ జెందున్. 49

తే. గీ. కష్టసుఖములఁ గడపుచుఁ గాఁపురంబు
సలుపువానికి సమకూరు సాధువృత్తి;
కాఁగి చల్లవాఱినపాలకరణి శాంత
భావమున నాత్మతుల్యులఁ బరులఁ దలఁచు. 50

తే. గీ. గడ్డిపోఁచలు పేటియై గంధగజము
గదల నీని తెఱంగున, గాఢసఖ్య
మైన దుర్బలసంఘము నభిభవింపఁ
జాలు బల్లిదుఁ జీమలు సర్పము నటె. 51

తే గీ. చదువు నేరని జవరాండ్రచక్కఁదనము,
పరిమళము లేనిమోదుగువిరులరూపు,

విద్య లేకున్న పురుషుల విభవమునట,
మంటఁ బాఁతఁగఁబడినట్టి మణివిభవలె. 52

ఆ. గీ. చక్కఁదనము గలుగు జంపతులకు విద్య
తళుకు బంగరునకు వలపుఁ బోలుఁ;
జదువు జంటగాంచుఁ జదువు ముదంబును
జెందు నన్నిజతలు పొందు ముదము. 53

ఆ. గీ. పరఁగు సజ్జనులకు బాలకు నీళ్ళకుఁ
బోలెఁ జెలిమి; వృద్ధిపొందుచుండుఁ;
జెలిమి గల్గి పోయి చింతఁ జెందించెడిఁ
గను నరునకు గ్రుడ్డితనము వోలె. 54

తే. గీ. ఎంతొ వేగముగాఁ బ్రవహించునట్లు
గానఁబడు నెండమావులఁ గాంచుదీఱఁ
ద్రావ దొరకదు జలము; గాంతాధనాదు
లక్షయసుఖమ్ము లిడ వనిత్యమ్ము లగుట. 55

తే. గీ. తీఁగ నానాఁటికేచి పందిరి యలముచు,
నల్లెడలఁ బుట్టు పలుపిందె లెదిగి యొంత
యైనబరువు గణింపనియట్లు, కన్న
తల్లి, బిడ్డలఁ బెనుచు వంతయుఁ బదింత. 56

ఆ. గీ. ఆవు గడ్డిమేసి నఱిగి పాలగు; సర్ప
మానినట్టి పాలునగు విసంబు;
అమధురంబు మధుర మయ్యెను మధురంబు
నయ్యె మూర్ఖము సదసదుపాధి. 57

తే. గీ. ప్రొద్దు పొడుచుచుఁ దెలుపుదూర్పును; దదభిము
ఖునకు వలకడ దక్షిణ; వెనుకడాక
డెలు ప్రతీచియు దీచియు; వెలుఁగు నగ్గిఁ
బోలు వేసవి దినకరుఁ బొగడ మేలు. 58

ఆ. గీ మల్లెపూలు తావి నెల్లరయుల్లము
దనుపునట్లు లోకమునకు మేలె

చేయు ధర్మపరులు చెందిన కీర్తి
నేర్పు సుగుణము నవినీతులకును. 59

ఆ. గీ. నిండువెలుఁగిడుఁ బవలు సూర్యుండు; రే వె
లుంగు తన కెదురగునంత ద్రుంగఁ జేయు
రేయి చీఁకటి; తేజోతిరేకము నిసి
వీతిహోత్రున కగ్ని ప్రవేశమునను. 60

ఆ. గీ. భానుఁ జేదినమునఁ గానంబడం డాది
నమున నుపవసింప సమయబంధ
మాచరించి తప్ప రారోగ్య మప్పుడ
చెందినారు భక్తిఁ బొందువారు. 61

ఆ. గీ. పవలు లెండవేఁడిఁ బరితప్తగాత్రులై
పనుల నలసినట్టి ప్రజలు రేల
చందువెలుఁగుచేతఁ జల్లవడినచోట
గాఢనిద్రఁ జెంది కందు రెలమి. 62

తే. గీ. చంద్రుశైత్యము సుజనులసామవచన
మిక్షు విక్రుతుల మాధుర్య మించుఁబోండ్ల
నగలు కవులమనమ్ములు వారిజాది
పరిమళములు మహాపుణ్యపక్తిదారకు. 63

ఆ. గీ. అద్దమందుఁ గాంచి యందముగా మోము
తనివితీర దిద్దుకొనినయటు
శాస్త్రములను జదివి చక్కనినడవడి
నేర్చుకొనినయతఁడె నిపుణతముఁడు. 64

క. తనయుఁడును వినఁడు. వింపురె
తన కితరులుహితమె చెప్పఁ,దలఁచినఁ బ్రియముం
జను సత్యమ్మును వాకొన;
వినమికి వగపేల తనకు విధి సుతరంబే. 65

ఆ. గీ. తనువు మాంసమయము గన నొక్కఁడైన, మ
నోమయంబు భిన్నమే మెయి కత

మది, సుతుండు మనుజుఁ డన్న తమ్ముఁడు మామ
కూఁతు రక్క యత్త కోడ లనఁగ. 66

ఆ. గీ. అంద జొక్క కీతి నావిష్కరింపరు
చిత్రసృష్టికర్త చిత్తవృత్తి
మోము తేట ముక్కుగోము పల్వరుసల
సరణి వేరు మాటసవ్వడియును. 67

ఆ. గీ. రాలలో రతనము మేలు; మేరువు మాల;
నరులలో ద్విజన్మ; గిరులలో హి
మాద్రి మృగములందు హర్యక్ష; వృక్షము
లందుఁ జందు మనుజులందు సుకృతి. 68

ఆ. గీ. కాలచక్రమందుఁ గష్టము సౌఖ్యము
నొక్కదానిపిదప నొకటివచ్చుఁ
బగలు రేయి, లేమి భాగ్యము, చీఁకటి
వెన్నెల, చలి వేఁడి వితము గనుఁడు. 69

వ. కలియుగదుష్టచర్యలవిశాలముఁ బట్టియె కల్గుచున్నవే
ఫలమును బొందలేక యతికష్టముపా లగుచేలజేలయై
చలనమునొందివాచవినిజాలము నంబడుమీనుపోల్కి మ
న్దెలివి దొలంగ నీకరసి తిన్నఁగఁ జేసినమేటి కల్గెడిన్.

క. కాలగతి నెవ్వరైనను
జాల నరసి తప్పఁజేయఁ జాలనికతనన్
బోలునని యెల్లరనఁ దగు
నాలాగుననే ఫలించు నందఱకోర్కుల్. 71

క. శ్రీరామనవమియుత్సవ
మీరాజమహేంద్రనగరి నెసఁగించు ముదం
బారామవిభునికావ్యము
పారాయణ మాచరింత్రు పరదేశములన్. 72

క. ఎవ్వాడు పూనిన కర్జము
లప్పుడే నెరవేర్పవలయు నావల నన్నన్

నంప దభిలాషి యిది యేమి సలుపఁజాలు
నంచ నాదరమున; వృద్ధి నంది యేర్చు.

తే. గీ. పక్వమన్నంబు మాఁగినపండుఁ బ్రౌఢఁ
గాంత భుజియింపవలయు సుఖంబు గోరె
నేని సమయాతిపాతము హానికరము
రుచికిఁ బిమ్మట నేమి పెగచిన ఫలము.

క. విధివిముఖత నగుకష్టం
బధికున కే ననుభవింప కలవియె యుడుపన్
విధి శీర్ష చ్ఛేదము ధా
నిధిశాణోద్ఘర్షణంబు నేర్పిరె నిలుపన్.

తే. గీ. ఆయు వర్ధంబు సంగమ మౌషధంబు
మానదానావమానము మందిరమునఁ
గలఁత మంత్రంబు నీనవకంబు గోప్య
మంద్రు ప్రకట మొనర్చినఁ గంద్రుడుండు.

క. క్రుమ్మరుచున్న గ్రొంఫిని
గుమ్మరపురుగు మెయి నడుసు గొంచెమ్మునం
గ్రమ్మనె యాత్మకు సాక్షిత
నమ్మిన సంసారతాప నాశముగాదే. 84

తే. గీ. పరధనాపహారి పాపభీతుఁడు గాఁడు
కోప మాఁపలేఁడు గుచ్చితుండు
వెఁవెలందిచెలిమి దలఁపదు కామికి
సత్యమంతరిక్షజలరుహంబు. 85

క. ఎవఁడు, వొరకొనిన మేల్పని
కి విఘాతము మాటిమాటికిఁ గలిగినన్యో
గవిరహితుఁడు గా కంతం
బవహితుఁడై సేయువాఁడె యధికుఁ డనఁ దగుఁ

క. ఉత్తమునితోడి నెయ్యం
మ్ముత్తమునిం జేయు శుక్తి నుదకము గాదే

ముత్తెము మధ్యము పొందున
నుత్తము నట్లుండు నలదళోదకమువలెఁ. 87

తే. గీ. హర్ష కార్యమున న్వ్యసనాగమమునఁ
గఱవున న్శత్రువులతోడి కలహమందు
నరపతిద్వారమున మసనమ్మునందు
నెవఁడు సాయము చేయు బాంధవుఁ డతండు. 88

ఆ. గీ. కాలిలోన నాటి కడుబాధ గలిగించు
ముల్లు లాగ వేరుముల్లు వలచు
పగిదిఁ బగతు నడఁపఁ బగతునె ప్రోత్సాహ
పఱిచి తాను సుగము పడయవచ్చు. 89

ఆ. గీ. పల్లవములు పండ్లు మల్లెపూవులు చల్ల
గాలి చందనంబు గంగ చందు
నెల్లవారియుల్ల ముల్లాస మొందించు
నట్లు సుజనమైత్రి యలరఁ జేయు. 90

తే. గీ. కాలు జాఱినఁ బయన మాఁగకయె సాగు
జాఱెనేని నోరాఁపరా దేఱుదాఁటుఁ
గాన ననఁదగ దెవరిని గానిమాట
గాలుచుచు మది నిలఁ గలకాలము ముందు. 91

క. రుడిసంసారం బనియెడి
కడలి సుఖదుఃఖసంజ్ఞకల్లోలములన్
వడిఁ గొట్టఁబడుచు నలయున్
గడగానఁడు సాక్షి నాత్మఁ గానండేలిన్. 92

ఆ. గీ. శాస్త్ర మేల మూఢజనునకు దర్పణ
మేల గ్రుడ్డికి, ధన మేల నీయఁ
దినను లేనిపిసిని, కైన లేని విన్నాణ
మేల యాత్మతత్త్వ మెఱుఁగఁడేని. 93

ఆ. గీ. కొంతమేలు కొడుకు గుణ[illegible]ఁ డొకఁడైనఁ
గాదు మూర్ఖశతము గలిగిన నటు

షండహూము యొకఁడు చక్కఁడంచును జీకు
వాలు రెక్కఁకొట్లు పాఁప గలవె. 94

క. గిట్టుట తప్పదు పుట్టిన
నెట్టన్నిదినమ్ము లున్న నెవరికి నైనం
జెట్టులు నీడ నొసఁగిన
య ట్టొరులకు మేలు సేయు నతఁడె ఘనుఁ డగున్

క. పలుచనితో గ్లప్పినయె
మ్ములు నరములుకండనెత్తురుబొమ్మలు బొందుల్
లలనలు పురుషులు పగతురు
చెలు లనఁబడు మోహవికృతి చిత్ర మ్మహహా.

క. శ్రీపాలెపువంశమ్మును
గాపాడు నగస్త్యరాజు గాదిలిసుతుఁడన్
లోపముల నెన్న కెప్పుడు
నాపయి దయ యుంచుము హరి నలివదళాక్షా.

క. మాతకుఁ గనకమ్మకు నే
జేతఃపూర్వముగ నెపుడు సేసెదఁ బూజల్
ప్రీతిగ వందనశతములు
ప్రాత స్సాయాహ్నములన భక్తి నొనర్తున్. 98

ఆ. గీ. సాధువిబుధులార: సాధారణాబ్దము
చైత్రమాసమందుఁ జక్ధ ... 
ప్రీతినొంద బుధుల వీనులవి ... గా
శతక మొనరిచితిని శౌరి ... చి 99

క. బంగారువలువ దాల్పు
శృంగారరసాధిదేవజిత్వ ... పు ...
బంగారురాజుశతకము
వంగీకారమునఁ జదువ ... విమా. 100

సంపూర్ణ



